REG.No.M.2185 RE G-No.N 45

The First Telugu Bi-weekly in Andhra Desa, The only Telugu News Paper for H E H The Nizam's Dominions

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపఁబడును

హైదరాబాదు-దక్కను

GOLAKONDA PATRIKA. HYDERABAD Dn



సంపుటము ౫ } ప్రమోదూతనామ సంవత్సర ఆశ్వయుజశు॥ ౫ శనివారము 27—9—30 { సంచిక ౩౯

## ఏజెంట్లు కావలయును

మా పత్రికకు చందాదారులను కూర్చుటకు దిగువ స్థలములలో ఏజెంట్లుకావలయును:—

౧. సికిందారాబాదు, ౨. భువనగిరి, ౩. జనగామ, ౪. వరంగల్లు, ౫. మహిబూబాబాదు ౬. ఖమ్మం, ౭. వికారాబాదు, ౮. మహిబూబునగరు ౯. నిజామాబాదు,౧౦. బెజవాడ. ౧౧ కరీంనగరము, ౧౨. నాందేడు, ౧౩. గుల్బర్గా, ౧౪.సూర్యాపేట, ౧౫.మిర్యాలగూడెం, ౧౬. దేవరకొండ, ౧౭.ఆసిఫాబాదు

వివరములకై దిగువవారికి వ్రాయుడు.

మేనేజరు
గోలకొండ పత్రిక
తూర్పుబజారు హైదరాబాద్ దక్కన్.

# ఊహాపోహపంచకము—గోలుమేజు నాటకము—గ్రంధకర్త—పాత్రధారులు—పోషకు లెవరు?—

## సూత్రధారుడు—నాటకశక్తి—నరేంద్రమండలి—

గోలుమేజు నాటకము లండన్ నగరమున నవంబరు నెల రెండవవారమున ప్రదర్శింపబడును. నాటకమండలి కార్యనిర్వాహకులు తీవ్ర ప్రచారము చేయుచున్నారు. సమర్థులగు పాత్రధారులను నియమించినారు. కొందఱప్పుడే లండన్‌నగరమునకు పయనమైరి. మిగిలినవారిలో కొందరు త్వరలో బయలుదేఱగలరు. ఈప్రదర్శనము యెంతయో ధనమును వెచ్చించి, ఎన్నాళ్లనుండియో కృషిసలిపి చేయబడుచున్నది కాన ప్రపంచ చరిత్రయందు ప్రాముఖ్యము బడయగలదు.

* * * *

### గ్రంధకర్త,

ఈ నాటక గ్రంధకర్త సర్ జాన్ సైమన్ గారు. వీరు రెండు సంవత్సరములు కృషిసలిపి ఈ నాటకమును వ్రాసిరి. హిందూస్థానమునంతటను సంచారము చేసి, ఎందరో ప్రముఖులను దర్శించి, ఈ గ్రంధమును వ్రాసిరి. ఈ నాటకమునందలి ముఖ్యపాత్రలను బ్రిటిషువారు ప్రదర్శించుచున్నారు. దీనికై వారు తగు ప్రయత్నము చేసియున్నారు. కాని గ్రంధకర్తగారిని ప్రదర్శనము వీక్షించుట కాహ్వానించెదరో లేదో తెలియకున్నది. వీరికితప్పక ఈ యవకాశ మొసంగవలయునని కొందఱనుచున్నారు. ప్రదర్శనము నాటివరకైనను నిర్ధారణకాగలదు.

* * * *

### పాత్రధారులు

ఈ నాటకము పాత్రధారులలో నాలుగు విధములయిన వారున్నారు. ఒకరు స్వదేశరాజులు. రెండవవారు భారతీయ ప్రజల తరఫువారమని చెప్పుకొనెడివారు. మూడవతరగతిలో ఆంగ్లోయిండియన్ శాఖకు జెందినవారు. నాలుగవవారు ఖాసు బ్రిటిషుదేశీయులు. నాటకము యొక్క ఆ యా పాత్రల పోషణమునకై ఆ యా తరగతికి జెందినవారే యుండవలయునని కార్యనిర్వాహకులు దలచిరి కాన యీ యేర్పాటు చేయబడినవి వీరందఱును భారతదేశమేకాక ప్రపంచములో కూడ కొంతవరకు యేదోవిధమున ప్రసిద్ధిజెందిన వారు కాన ఈ నాటక ప్రదర్శనమునకు వన్నె దెచ్చెదరని పలువురు ఈ నాటకాభిమానులు తలంచుచున్నారు.

* * * *

### సందేహము

కాని కొందఱు పాత్రధారులకు కేవలము సైమన్‌గారిచే రచింపబడిన నాటకమునే ప్రదర్శించిన ఆకర్షణీయముగ నుండదని సందేహించుచున్నారు. వీరు మోతీలాలుగారిచే రచియింపబడిన, "అధినివేశ స్వాతంత్ర్యము" అను దానినుండి కొన్ని అంకములను ప్రదర్శించిన బాగుండునని అనుచున్నారు. ఏలయన "వాచా" ప్రదర్శనము ఈకాలములో చాలమందిని ఆకర్షించుచున్నవి. స్వదేశ రాజులతరఫునకూడ కొన్ని అంకములుకూడ సిద్ధముచేయబడినవి కనుక మూడు గ్రంధములనుండి ఆకర్షణీయములైన అంశములను నెత్తికొని ప్రదర్శించిన నాటకము బాగగునుండగలదు.

* * * *

### పోషకులెవరు?

ఏదేనినాటకము ప్రదర్శింపబడునప్పుడు ఒకానొక ప్రముఖుని పోషకత్వమున నాడబడును. అదేయాచార ప్రకారమీనాటకముకూడ బ్రిటిషు సామ్రాజ్యప్రధాన మంత్రులగు రామ్సే మెక్డనాల్డుగారి పోషకత్వమున జరుగును. ప్రపంచములో ప్రాముఖ్యమైన వ్యక్తి పోషకత్వమున నాడబడు నాటకము అసాధారణమైనదేయని చెప్పవలయును. వీరికి నాటకము జరుగునంతకాలముండుటకు వ్యవధిలేనందున వీరిస్థానమునుండుటకు స్యాంకీప్రభువుగారుకూడ కోరబడిరి.

* * * *

### సూత్రధారుడు

ఇక నాటకమునందలి విశేషములకు వత్తము. ప్రతినాటకమునకు సూత్రధారుడుండుట నాటకాచారము. ఈ కార్యభారము బెన్నుగారిపైన బడినది. వారీపాత్రను సమర్థతతో పోషించగలరని తలంచుచున్నాను. నాటకముయొక్క ప్రాశస్త్యము, సూత్రధారునిబట్టి యుండును. నాటకముగూర్చిన విశేషము సభ్యులకెరుకపరచుట ఇతని ధర్మము. ఇంతియకాక నాటక ప్రారంభము ఒకొకసారి తలత్రోకలేకుండ జరుగును. కాన అద్దానిగూర్చి సభ్యులకు సూత్రధారుడే ప్రవేశము కలిగించవలసియుండును.

* * * *

### ప్రథమాంకము

నాకు దెలిసినంతవరకు ప్రథమాంకము సైమన్‌గారి గ్రంధములోనిదే. ఈ అంకమును ప్రదర్శించువారు బ్రిటిషువారును ఆంగ్లోఇండియనులు మాత్రమె. ఏలయన ఒక ఆంగ్లేయుడు వ్రాసినవిషయములు ఆంగ్లేయులే సమర్థతతో ప్రదర్శింపగలరని కార్య నిర్వాహకులు తలంచుచున్నారు. ఇది భారతీయుల నాకర్షించకున్నను బ్రిటిషువారికి మాత్రము సంతృప్తికరముగనుండగలదు.

* * * *

### నాటకశక్తి.

కాని నాటక ప్రదర్శనము భారతీయ నటకులు ఒకసీను ప్రదర్శించగనే రక్తికట్టును. అప్పుడే గుసగుసలు, ఈర్ష్య, కోపము, తాపము, ప్రేక్షకులలో నేకాక ప్రథమాంకమును ప్రదర్శించిన పాత్రధారులకుకూడ కలుగును. పాత్రధారులు తమశక్తిసామర్థ్యములను ప్రదర్శించి కార్యనిర్వాహకులచే మెప్పు బడయవలసిన సమయమిదేకాన వారొకరికన్న నొకరు మించుటకు ప్రయత్నింతురు. భారతీయ నటకులలో మహమ్మదలీ, శ్రీనివాసశాస్త్రి, సప్రూ జయకరు, అయ్యరు మున్నగువారు తమకై నిర్ణయింపబడిన పాత్రలను బాగుగ పోషింపగలరు. బ్రిటిషు పాత్రధారుల పేర్లింకను ప్రకటింపబడలేదు కాన వారిగూర్చి యెట్టి అభిప్రాయము సూచించుటకవకాశములేదు.

* * * *

### నాయికామణులు

ఏనాటకమైనను స్త్రీలు పాల్గొన జాలకున్నను పురుషులైనను నాటకరంగమున స్త్రీ పాత్రలు ధరించి ఆకొరతతీర్చుట అచారమైపోయినది. కొంతకాలమునుండి స్త్రీపాత్రలు స్త్రీలే వేయవలయునని నాట్యకళా విమర్శకులు సూచించుచున్నారు. ఇదియేదృష్టియందుంచుకొని కాబోలు ఈనాట్యమండలివారు స్త్రీని యేర్పాటుచేసినారు. ఇంతవరకు వంగరాష్ట్రమునందలి షఫీసా కుమార్తె ఈభారమువహించుటకు సమ్మతించెను. వృద్ధమాతయగు బీసెంటమ్మగారిని కూడ అహ్వానించనున్నారు. వారొప్పుకొనినచో నాటకమునకు రక్తి గలుగకపోదు.

* * * *

### నరేంద్రమండలి

నరేంద్రమండలివారుకూడ కొన్ని రంగములు ప్రదర్శించెదరని పైనజెప్పితినికదా! వీరిలో ఇస్మాయిల్ సా॥ ప్రాముఖ్యమైన పాత్రధరించగలరు. ఇతరులుకూడ కొన్ని పాత్రలుధరించి తమధర్మము నిర్వహించుకొనెదరు. వీరు తమపాత్ర నిర్వహణమునకు జ్ఞానముసంపాదించుకొనుటకై కాబోలు అందరికన్న మొదట లండను పయనమైరి. వీరుఒకవైపు బ్రిటిషువారియొక్కయు, రెండవవైపు భారతీయ ప్రజలయొక్కయు, మెప్పు బడయవలయును. కాన వీరికిచాల కృషిసలుప వలసియున్నది.

* * * *

### మొత్తముపైన

ఈనాటకమునందు చేరుటకు కాంగ్రెసుమండలివారు నిరాకరించినను ఇదిజయప్రదముగజరుగగలదని ఆశగలదు. కాంగ్రెసువారికి నటనాకౌశలము లేక కాదు, ఇట్టి నాటకముల నాడగూడదనియె వారు తీర్మానించుకొనినందున ఇందుపాల్గొనుట లేదు. నాటకముయొక్క ప్రాశస్త్యము గూర్చి ఇంతకన్న హెచ్చు వ్రాసిన ప్రేక్షకులు చూడవలసినదేమియుండదనియు, అభిరుచి తగ్గునని తలంచి యు ఇంతటి తోనె ముగించెదను. ఇతర విషయములు లండన్‌నగరమునందు జేమ్సుప్యాలేసు నందు చూచినవారికే తేటపడగలవు.

«యుగంధరుడు.»

మహార్నవమియగుటచే బుధవారము పత్రిక ప్రకటింపబడదు.

వ్యవస్థాపకుడు.


గోలకొండపత్రిక

ప్రమాదీచ నామ సం॥ ఆశ్వయుజ శు॥ ౧౧

శనివారము


# విజయదశమి

శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే
"భగవద్గీత"

భారత అభ్యుదయమునకై ధర్మస్థాపనకు గాను ద్వాపరమున ఆదర్శ పుణ్యపురుషుడగు శ్రీకృష్ణభగవానుడు లోకమునయవతరించెను అట్టి సమయముననే పాండునందనులు పుట్టియుండిరి. కావుననే ఆయుగమును వీరయుగమనియందురు.

విజయదశమియను నామాంతరముగల దసరా హిందువులకుముఖ్యపండుగదినము. ప్రతి దేశమందలి హిందువులచే యీపండుగ అత్యంతవిజయవంతముగా జరుపబడుచున్నది. ముఖ్యముగా మైసూరునందు ఈపండుగకు ప్రాముఖ్యమధికముగా గలదు. ఈరోజులలో ఆయుధశమీపూజలు చేయబడును. ధ్వజారోహణోత్సవము కూడ జరుపబడును.

పై నుదహరించినటుల ద్వాపరమునందు అనగా మహాభారతకాలమున పాండునందనులు పండ్రెండువత్సరములకాలముఅజ్ఞాతవాసమునుచేసి ఉత్తరగోగ్రహణ యుద్ధసమరమున పేడియగు అర్జునుడు (బృహన్నల) ఉత్తర కుమారునితో శమీవృక్షము వద్దకేగి, పూజలనాచరించి యుద్ధమునకేగ జయమొందినదీవిజయదశమినాడే. త్రేతాయుగమున రావణుని సంహరించి, సీతనుగైకొనినదియు ఈ విజయదశమినాడే. కాన విజయదశమినాడు మనకర్తవ్యమేమి?

కలికాలమున దేశీయుల నుద్ధరించుటకై సబర్మతీ గాంధిమహాత్ముడని పేరుబడసిన మోహనదాసు కరంచంద్ గాంధీ జన్మించెను. వారు నేటివరకు చేసినట్టియు ప్రస్తుతము చేయుచున్నట్టియు చర్యలు పాఠకులకు దెలిసియేయున్నది.

భారతదేశము కడు హీనస్థితిలోనున్నది. ప్రజలు భోజనపూట కైనను తిండిదొరకక మలమల మాడుచున్నారు. ఇట్టివారికి కొంతకైనను సహాయము చేయుట మన ధర్మము.

మహాత్ముడు దరిద్రనారాయణుని పారద్రోలుటకు చర్ఖాయంత్రమును కనుగొనెను. దానిని నుచరణయందుంచుట ప్రతి స్త్రీ పురుషుని కర్తవ్యము. పిండివంటలుచేసికొని కడుపునిండ భుజించినంతనే దసరాపండుగ కాదు. స్వదేశవస్తువులనే యుపయోగించెదమనియు దేశీయవస్త్రములనే ధరింతుమనియు ...... వాడెదమనియు, ఆనాడు శపథముచేయవలయును. సంవత్సరమంతయు దీనిప్రకారము నడచినచో విజయదశమి సార్థకమగును. అపుడే భారతీయులకు విజయము చేకూరును. మహాత్ముడు ప్రమోదూత సంవత్సరారంభమున ప్రారంభించిన స్వాతంత్ర్యద్యమము విజయదశమినుండి సంపూర్ణవిజయమును బడయుగాక!

సర్వేజనాః సుఖినోభవన్తు

## ౧౩౪౦ ఫ. ఆదాయవ్యయపట్టిక

మన ఆర్థిక శాఖవారు ౧౩౪౦ ఫ. ఆదాయవ్యయ పట్టికను ప్రకటించియున్నారు. దీని వివరములు గతసంచికయందే నిచ్చియుంటిమి. ౧౩౪౦ ఫ లో ౮ కోట్ల ౩౯ లక్షల ౨౧ వేల ఆదాయము వచ్చుననియు, ౭ కోట్ల ౮౦ లక్షల ౭౬ వేల వ్యయమగుననియు, ౫౮ లక్షల ౭౫ వేలు నిలువ యుండుననియు, ప్రకటింపబడినది.

మన రాష్ట్రముయొక్క ఆర్థిక పరిస్థితులను చక్కబరచి కొన్ని సంవత్సరములనుండి ప్రతివత్సరము నిలువ పట్టికలనే ప్రకటించుచున్న ఆర్థిక శాఖామంత్రులగు నవాబు సర్ హైదర్ నవాజు జంగ్ బహదురుగారెంతయు ప్రశంసనీయులు. వీరికృషిని నిజాం ప్రభువుగారు కూడ కొనియాడియున్నారు.

గతవత్సరముకన్న ఈసంవత్సరములో నిజాం రయిల్వేనుకొనుటయు, దాని లాభమును ప్రజాహిత కార్యములకు వినియోగించుకొనుటయునొకవిశేషము. రైల్వేనుగడువుకన్నముందు కొనుటచే సంస్థానమునకులాభముకలిగెనేకాని నష్టముకలుగలేదని వీరిపుడు మరల సమర్థించుచున్నారు. బహుశః యీవిషయము నిపుడు సూచించుటకునాడు కొందఱు ప్రజాప్రముఖులుచేసిన విమర్శనమే కారణమైయుండనోపును.

౧౩౪౦ ఫ. లో దాదాపు ముఖ్యశాఖలాదాయములో హెచ్చుదల యయ్యెనని ఆదాయవ్యయపట్టికయందుసూచింపబడినది. కాని ప్రజాభిప్రాయమునేమాత్రము గమనించక తమ కిచ్చవచ్చినట్లు భూమిశిస్తులోను, తపాలచీట్లకును, రిజిస్ట్రేషనుకును, హెచ్చుచేసిన ఆదాయము హెచ్చకుండునా? బ్రిటిషుఇండియాలో వ్యయములకు సరిపోవునాదాయము లేదనిచెప్పి ఆయా ప్రభుత్వములు పన్నుల హెచ్చించుచున్నవి. కాని ఇచట ప్రజలదురదృష్టమేమొకాని ప్రభుత్వవ్యయములకు పోగ లక్షలకొలది ధనము మిగిలినను పన్నులు హెచ్చింపబడుచునే యున్నవి.

అయిదునెలలకు పూర్వము కాద్లు, లిఫాఫాలవెలలు హెచ్చింపబడెను. దీనికి కారణమేమైనకలదా? ఆదాయ వ్యయపట్టికలో హెచ్చుమొత్తములు జూపుటకుమాత్రమే ఈ హెచ్చుదల చేయబడుచున్నదా? ఇదేవిధముగ ౧౩౪౦ ఫ. సంవత్సరములో నల్లగొండజిల్లాలో రివిజన్ బందోబస్తు జరిగినది. అచట రైతులెంత మొఱపెట్టుకున్నను బందోబస్తువారు భూమిశిస్తును పూర్వముకన్న రెండింతలు హెచ్చు చేసివేసిరి. స్టాంపుల విలువ హెచ్చుచేయుటకు 'ముకద్దమాబాజీ' తగ్గుటచేయుటకేయని అసలులోనికి దెచ్చునపుడు బాధ్యతగల అధికారులు వాక్రుచ్చిరి. ఈ హెచ్చుదల వలన ముకద్దమాల సంఖ్య తగ్గినదాయని మేము ప్రశ్నించుచున్నాము.

నల్లగొండ గంజాయి ఆదాయములో ఒక లక్షరూపాయిలు హెచ్చునని పట్టికలో సూచిమారి కలిగిన ప్రచార ఖండింతయని చెప్పజాలము. ఈ మద్యపాన వలన ప్రజలేవిధముగ బికారులగుచున్నారో వేరేచెప్ప నక్కరలేదు. బ్రిటిషు ఇండియాలో విస్కీకును ఆబ్కారీఆదాయమునకును ముడిపెట్టి మత్తుపదార్థముల గాబడి తొలగించకుండ చేయుచున్నారు. అయినను ఇటీవల ప్రారంభింపబడిన సత్యాగ్రహము వలన ప్రభుత్వము వారి రాబడి తగ్గిపోవుచున్నది. ఇట్టిసంస్కరణములలో బ్రిటిషు ప్రభుత్వముకన్న స్వదేశ సంస్థానములు మార్గము చూపవలసినదాని బదులు స్వదేశప్రభుత్వములే ఈయాబ్కారీవలన హెచ్చుధనము సముపార్జించుటకు ప్రయత్నించుచున్నవి. మద్యముధర హెచ్చినను త్రాగుడువారిసంఖ్య తగ్గినదా? తగ్గలేదు కాని వారింకను అప్పులపాలగుచున్నారు. అట్టిచో డ ప్రస్తుతవిధాన మెంతమాత్రము దేశాభివృద్ధికి మేలైనది గాదని ఘంటాపథముగ చెప్పగలము.

హిందూపత్రిక వ్రాసినట్లు ఈ రాష్ట్రము భారతదేశమునందలి ఇతర రాష్ట్రములకన్న చాల వెనుకబడియున్నది. అందుచే విద్యయందభివృద్ధి కలుగుట ముఖ్యాతిముఖ్యము. అందులో ప్రాథమికవిద్య విరివిగ వ్యాపింపవలయును. ఉన్నత విద్యకై ప్రాథమిక పాఠశాలలసంఖ్యను తగ్గించుటచే ఈ యుద్దేశము నెరవేరుటలేదు. భూమ్యాదాయము, తపాల, స్టాంపు, మున్నగువానియందు పన్నులు హెచ్చించినను, ప్రాథమికవిద్యావ్యాపకమునకై హెచ్చుఖర్చుచేయుటావశ్యకము. కాని ఈ ఆదాయ పట్టికయందు మాత్రము అట్టిసూచనలేవియు గాన్పించుటలేదు. విద్యాశాఖ ఖర్చుక్రింద పూర్వముకన్న లక్షలు హెచ్చుగనున్నట్టు చున్నవి. ఈ మొత్తముకూడ ఈసంవత్సరములో నెలకొల్పబడిన ఇంజనీరింగు కళాశాలకే సరిపోవునోనేమో? ఉస్మానియా విశ్వవిద్యాలయ భవనములకై ౭౦ లక్షల మొత్తము నిర్ణయింపబడినది. కాని అదే మొత్తమును రాష్ట్రమంతటను ప్రాథమిక విద్యాప్రచారమునకై నొసగియున్న నాలుగైదు సంవత్సరములలోన చదువువచ్చినవారి సంఖ్యలో ఆశ్చర్యకరమైన అభివృద్ధికాకయుండెడిదా?

జిల్లాల రోడ్లకును, నీటివసతులకును, ౨౫ లక్షలు నిర్ణయింపబడినవి. నిజాంరాష్ట్రములో హైద్రాబాదు, ఔరంగాబాదు నగరములు తప్ప మిగతయేపట్టణమందైనను నీటి సౌకర్యములు లేవు. ప్రతివత్సర మాదాయ వ్యయపట్టికలో కొంత మొత్తమిట్టి సౌకర్యములకై నిర్ణయింపబడును. కాని ప్రతిసంవత్సర మీధనముపయోగించి ఏయే పట్టణములలో నీటివసతులు గల్పింపబడుచున్నవో తెలిపియుండిన బాగుండెడిది. ఇదేవిధముగ రోడ్లు చాలభాగములలో లేవు. కనుక ఈకార్యములకు సంబంధించిన శాఖాధికారులు ఆర్థికశాఖవారునిర్ణయించిన మొత్తమును సద్వినియోగపరచి దేశాభివృద్ధికి తోడ్పడవలయును.

హిందూపత్రిక అభిప్రాయపడినట్లు ఈ రాష్ట్రమున ధనము కొఱతలేదు. కాని ఆ ధనమును సద్వినియోగపరచి దేశాభివృద్ధికి మార్గముజూపుఅధికారులు కావలసియున్నారు. అట్టివారుండిననే దేశమునకు కీర్తివచ్చును. ప్రస్తుత విధాన మనుసరించి రాష్ట్రముయొక్క పరిపాలనాభారమంతయు అధికారుల హస్తగతమైయున్నది. కాన వారు సమర్థులైనవారుండుట అవసరము హెచ్చుగాగలదు. కనుక దయామయులగు ప్రభుత్వమువారీవిషయమున శ్రద్ధవహించి, దేశాభివృద్ధికి మార్గముల న్వేషించగలరని కోరుచున్నాము.

# వినాలేరా?

ధార్వాడ ప్రాంతములో అటవీ సత్యాగ్రహమున రెండువేల గ్రామవాసులు చేరిరి.

* * * *

పట్నాలో పదిగ్రామములయందు చౌకీదారీ పన్ను ఇచ్చుటకు నిరాకరింపబడినది,

* * * *

ఒక ఆంగ్లేయస్త్రీ వాయువిమానముపై ౧౫ రోజులలో ౧౧ వేల మయిళ్లు ప్రయాణముచేసెను.

* * * *

ప్రస్తుతము విమానములు నిమిషమునకు అరుమయిళ్లు చొప్పున నడపబడుచున్నవి

* * * *

ఇండియను డెయిలీమేలు పత్రికను మన ప్రభుత్వము వారు ౩ లక్షల అప్పునిచ్చినట్లు పలువురు అనుకొనుచున్నారు

* * * *

సహీఫా పత్రికాధిపతిగారు ఇంగ్లాండు రౌండుటేబిల్ సమావేశమునకు పత్రికా ప్రతినిధిగా వెడలుట కుద్యుక్తులై యుండిరి కాని వారికనుమతి లభించలేదు

* * * *

కలకత్తాలో ప్రచురింపబడుచున్న స్టేట్సుమేన్ పత్రికకు మన ప్రభుత్వమువారు ధనసహాయము చేయనున్నారట

* * * *

ఎంగ్‌యిండియా వారపత్రికను నిజాం రాష్ట్రములో నిషేధించియున్నారు.

* * * *

మయిసూరు ప్రభుత్వము వారు స్త్రీలకు కొన్ని నూలువడుకు పన్నులు ప్రసాదించనున్నారు

* * * *

లవణ సత్యాగ్రహమునలన అరెస్టుచేయబడిన వాయువ్య సరిహద్దు రాష్ట్రములోని కొందరు విడుదలయగుచున్నారు

## దసరా పూజ

దీనినే విజయదశమి యందురు. రాజులు దిగ్విజయమునకు వెడలునది ఈనాడే. అర్జునుడు విరాటనగర బాహ్యప్రదేశమున తాను శమీవృక్షముపై దాచియుంచిన ఆయుధములకును వృక్షమునకును పూజించి దుర్యోధనాదులగు మహావీరులను గెలిచినది ఈనాడే. మానవులకు ఆదర్శచరిత్రుడగు రాముడు రావణుని జంపినది ఈనాడే. కాళికాదేవి, ఇప్పటి మయిసూరుదేశపు పూర్వ అనార్యరాజగు మహిషాసురుని (మహిషాసురుని) తో తొమ్మిది యహోరాత్రములు పోరాడి విజయము గాంచినది ఈనాడే. కాని యిట్టిసంతోష దినమున మనమేమి చేయుచున్నాము? రాజ్యములేనివారమగు మనము క్రొత్త జండాల నెక్కించి సంతసించుచున్నారము. ఇది పరిహాసముకాదా? దుష్టగుణముల సంహారముచేయ శక్తులమగు మనము నోరులేని సాధుజంతువులను చావగొట్టి సంతసించుచున్నారము, దయమాపలేని మనము నిర్దయ పుష్కలముగా చూపుచున్నారము. కాని యావాడు రాముని విజయము, అర్జునుని అజ్ఞాతవాసము, దేవీ విజృంభణము మొదలగు యితిహాసములను శమీవృక్షము నొద్ద సభచేసి పారాయణముచేయుదుము, వినుటయు నగదా సార్థకము.

### ఆయుధపూజ

మనముచేయు ఆయుధపూజ నెటువంటిది? పూజయన సత్కరించుట, గౌరవించుట, సేవించుట: ఇత్యాది ప్రాధాన్యముగ ప్రాణముగల జీవులకు చెల్లును. ఇక ప్రాణములేని జడవస్తువులు: అనగా యంత్రములు ఆయుధములు పనిముట్లు మొదలగు వస్తువులను పూజించుట సేవించుట అనగా వానిని బాగుగా శుభ్రపరచుట విరిగినవి సరిచేయుట క్రొత్తవి నిర్మించి సిద్ధముగా కాపాడుకొనుటయై యున్నది. ఎందుకనగా కావలసినపుడు వాని సహాయమువలన సులభముగా పనిపాటలు జేసుకొనగలిగి సుఖముగ సంసారయాత్ర గడుపుకొనుట మన ఆచారపద్ధతియై యుండెను. ఆ పరువు మనమిప్పుడు ఆచారములేని మన అజ్ఞానము అలవాటులవలన చేయు ప్రతికార్యము సిద్ధపడేరు చెప్పి స్వార్థపిశాచమునకు దాసులమయి దిక్కులేని నోరులేని దీనపశువులను జంపి నిర్దోషజీవుల రక్తముతో యంత్రములను పనిముట్లను ఆయుధములను తడిపి ఓమా లేక చల్లియో తల్లి శాంతించెనని తమ జిహ్వాచంచలతను శాంతపరచుకొనుచున్నారము. మాంసాహారుల తృప్తికి అనేక కాకాహారులగు యజమానులుకూడ లోంగి దక్షిణచ్చి చేయించుట పరిపాటియై యున్నది. కావున నో దయామయులారా? శుభదశహర పండుగలో మీ పవిత్ర హస్తములద్వారా ఏపశువునుగాని పక్షులపాలు జేయక ఆర్థియదాన మొసగుటకు దయాప్రతము బూనెదరుగాక,

(జీవరక్ష జ్ఞానమండలి)

## సినిమా ప్రపంచము

### రోడాల్ఫు వెలింటినో

చనిపోయినవారందు రోడాల్ఫు వెలింటినో „షేకు యొక్క పుత్రుడు" యను ఫిల్మునందు ప్రధానపాత్రను ధరించెను. తండ్రి పాత్ర, పుత్రుని పాత్ర ఒక్కడే చేయుటవలన ఇతనిపాత్ర పోషణ మత్యద్భుతమని ఒప్పుకొనక తప్పదు. కాని భారతదేశ ఫిల్ముకంపెనివారు ఏయొక పర్యాయమైనా నిటువంటి నటనాకౌశలము నను భూనుకొనిరి. ఆదియు పేరు ప్రఖ్యాతిగాంచిన మాస్టర్ విఠల్ అయినను జయముమాత్రము కలుగలేదు.

### నవారో

అద్భుత నటనాకౌశలము కలిగిన రోమన్ నవారో నేటివరకు ఒక నటకుడుగా పనిచేయుచుండెను. దీనిని విడచి నవారో ప్రస్తుతము ఫిల్ము డైరెక్టరుగా పనిచేయ సమకట్టినాడు కావున ఇతడిందు కార్యసిద్ధి గాంచునో లేదో చూడవలసియున్నది

### లాంచనీ

సినిమారంగమునందు ప్రఖ్యాతివడసిన లాంఛని ఇటీవల పరలోకరంగమున కేగినాడు. ఇతడు సాధారణ మనుష్యునిగా ఈసినిమారంగమున ప్రవేశించి సుప్రసిద్ధ నటుడుగా ప్రసిద్ధి వడసెను. „ఫాంటమ్ ఆఫ్ ది ఆపెరా" నందు ఈతని నటనాకౌశలము కానవగును. మెట్రోగోల్డ్విన్ కంపెనివారు మాసవేతనముక్రింద ఇతనికేయులు వేల రూపాయలతో నియమించిరి. ఇట్టివారి మరణమువలన ఈ కంపెనివారికెంతయో నష్టము వాటిల్లెనను టలో అతిశయోక్తి యుండజాలదు.

### ఫేరు బాంక్సు

ఒకటి ఘనతవచ్చినవాడు డగ్లాసు ఫేర్ బాంక్సు సామాన్య నటుడుగానుండి స్వంత ఫిల్ము కంపెనిని నడుపుచున్నవాడు. వెనుకలులేని మనిషి ఇతడేనాయని సినిమా ప్రదర్శనము చూచువారలు భ్రమజెందుదురు. ఈతని భార్య మేరిపిక్ఫర్డు ఈమెయు మంచి నటకురాలేకాని కొన్ని చేష్టలు ఈయమకు బాగుగా నుండవు.

„నేను"

## హైదరాబాదు స్వదేశీ లీగ్ సమావేశము

ఈనెల నిన్న సాయంత్రము ౯-౩౦ గంటలకు రెసిడెన్సిబజారులోని క్రెసెంథియేటరునందు డాక్టరు అతిపుసయీడు యాజమాన్యమున జరిగెను, ప్రథమమున అధ్యక్షులు నైజాంరాష్ట్రి పరిషద్దులలో సభలు నిషేధింపబడుటచే ఇచట జమపలసిచ్చిన దనియు. ప్రస్తుత ముపన్యసింపబోవు విషయము దేశాభివృద్ధికి ముఖ్యావశ్యకమనియు, దీనినిగూర్చి ఆచార్యరేగారు బొంబాయి, మద్రాసు పట్టణములలో నుపన్యాసమా లొనగిరనియు, మన దేశాభివృద్ధికి మన స్వదేశవస్తువులను ప్రచారమునకు దెచ్చుట ముఖ్యమనియు నుడివిరి. తదుపరి పండిత శ్రీనివాసశర్మగారు హిందూదేశ మున్ని దేశములకంటె దారిద్ర్య పిశాచముచే పీడింపబడుచున్న దనియు, కొన్ని సంవత్సరములకు పూర్వము మన దేశము ధనధాన్యములచే ఏతరి సకలదేశములకు మిన్నయై యుండినను ప్రస్తుతము చేతిపనులు నశించుటచేత దారిద్ర్యము సంభవించెననియు భావికాలమున యంత్రపరిశ్రమలకు ప్రాముఖ్యము గలదనియు మన దేశాభివృద్ధికిగాను స్వదేశవస్తువులనే ప్రచారమునకు దెచ్చుచు విదేశవస్తువులను బహిష్కరించవలయుననియు, [illegible] యిచట శ్రీమతి పద్మజానాయుడుగారి యాజమాన్యమున స్వదేశసంఘము స్థాపింపబడినదనియు. దీనిని వృద్ధికి హైదరాబాదు దేశీయులకే గలదనియు నుడివిరి.

పిమ్మట మౌల్వీ ఫజులుహమాన్ సాహెబుగారు వినయముగ హిందూదేశము సమస్తదేశములకన్న సంపదలచె తులతూగుచున్నదనియు నిందొకవిషయమున దారిద్ర్యముచే పీడింపబడుచున్నదనియు, హిందూదేశపుభూములు సారవంతములై సువర్ణమును యుత్పత్తి చేయునట్టివై యున్నను దేశీయ పరిశ్రమలు నాశనమగుటచే దారిద్ర్యము తాండవమాడుచున్నదనియు, ఇటుల హిందూదేశము, యూరోపు, రష్యా మొదలగు దేశములు గలవనియు, స్వదేశిపరిశ్రమల నభివృద్ధి యొనర్చుట విద్యుక్తధర్మమై యుండు, ఇది ప్రారంభ దశయందున్నదనియు దీనిని అభివృద్ధి పరచవలయుననియు నుడివిరి. తదుపరి శ్రీయుత బూర్గుల రామకృష్ణారావుగారు ఆంధ్రములో నివిషయములను విపులముగ తెలిపిరి. అధ్యక్ష మహాశయుల యుపసంహారోపన్యాసనంతరము ౧౧-౩౦ గంటలకు సభముగిసెను.

H· E. H, The Nizam,s State Railway

## మహాఘనత వహించిన నిజాంరైల్వే

### ప్రకటన

అక్టోబరు ౧ తేదీ బుధవారమునుండి హైదరాబాదు (బి.జి.) సికిందరాబాదు మధ్యనడచు నెం.౨ డౌన్‌పాసెంజరు ఖైరతాబాదు, బేగంపేటగేటు, జేమ్సు వీధి, స్టేషనులలో దిగువవేళలకు నిలుచును:—

| | | |
|---|---|---|
| హైదరాబాదు (బి. జి) | రా | ౧౫.౪౮. |
| | పో | ౧౬.౧౫ |
| ఖైరతాబాదు | ,, | ౧౬.౧౯ |
| బేగంపేటగేటు | ,, | ౧౬.౩౧ |
| జేమ్సువీధి | ,, | ౧౬.౩౫ |
| సికింద్రాబాదు | రా | ౧౬.౩౭ |
| | పో | ౧౭.౨౫ ఖాజీపేటకు |

పై తేదినుండి నెం.౭౫ లోకలుబండి ఇప్పటిటైంకన్న ౫ నిమిషములు ఆలస్యముగ హైదరాబాద (బి. జి.)కు సికిందరాబాదనుండి గం ౧౬.౫౦ బయలుదేరును.

5 అప్ పాసెంజరు సికింద్రాబాదనుండి౧౬.౪౪కు అనగా ఇప్పటి టైంకన్న ౩ నిమిషములు ముందు బయలుదేరి హైదరాబాద (బి. జి.)కు ౧౬.౩౯కు అనగా ౫ నిమిషములు ఆలస్యముగవచ్చును. ఈబండి కొన్నినిమిషముల ఆలశ్యముతో బేగంపేట కురుకుంట మధ్యనడచి ప్రస్తుత టైంటేబలునుండి కలుపుకొనును.

నెం.౨౬ డౌన్ మహమ్మదాబాదు బీదరు పాసెంజరు వికారాబాదునుండి ౧౭.౫౦కు అనగా ౨ నిమిషములు ఆలస్యముగ బయలుదేరును. కాని హైదరాబాద (బి. జి.) కు ఇప్పటి టైంకేచేరును.

ఈబండ్ల కాలవివరములకు స్టేషనులయందు విక్రయమునకు లభించు పాకెటు టైంటేబిల్ చూడుడు.

| | |
|---|---|
| చీఫ్ట్రాన్సు సుపరింటెండెంటు ఆఫీసు సికింద్రాబాదు | (అనుమతిచే) ఎచ్.ఇ. విలియమ్సు |
| ౨౫ సెప్టెంబరు ౧౯౩౦ | సుపరింటెండెంటు. |

## శుభవార్త

24 అక్టో॥ సోమవారం ఘనతహొందిన శ్రీ రెడ్డి యువజన విద్యార్థి నాటక సంఘము వారు ఆంధ్ర నాటక పితామహ యను బిరుదు వహించిన ధర్మవరం రామకృష్ణమాచార్యులచే రచియింపబడిన పాంచాలీ అజ్ఞాతవాసమను నాటకము ప్రదర్శింపబోవుచున్నారు. కావున ఆంధ్ర సోదరులందరు దయచేసి ప్రోత్సహించగలరని వేడుచున్నాము.

విద్యార్థులకు అర్ధరేట్లకు టికెట్లువిక్రయింపబడును సీట్లు ముందుగారిజర్వుచేయించుకొనుట యుక్తము. ఆలసించిన ఆశాభంగము కలుగును.

పురుషులకు టికెట్ల వివరము 3, 2, 1 8 0.
100 080

స్త్రీలకు రు 3, 2, 1, 8 అణాలు.

ఇట్లు
రెడ్డివిద్యార్థి నాటకసంఘ కార్యనిర్వాహకులు.

## గోలకొండ పత్రిక

### ఏజంట్లు

హైదరాబాదు

1 జి. ఆర్. మూర్తి — లింగూడ
2 నా. గౌరీశంకరవర్మ — రెసిడెన్సీబజారు
3 కాళిదాసు బి పురోహిత్ — ,,
4 డి. యస్. మోహన్లాల్ ఖత్తరు మసీదు ఎదుట — గౌలిగూడ
5 భవానీ అండుకో నల్లగొండ





## గోలకొండ పత్రిక

తూర్పు బజారు హైద్రాబాదు దక్కన్.

సంవత్సరము చందా

| | |
|---|---|
| | రు. ౬-౦-౦ |
| అర్థ | ౩-౧౨-౦ |
| విడి పత్రిక | ౦-౧-౪ |

Prin-- and Published by G. Ramakrishna Reddy at Golkonda Power Press, Hyderabad, Dn. Editor K. Balakrishna Reddy.